# మూడు లోకముల మర్మాలు

నేటి ప్రతీ క్రైస్తవుడు తెలుసుకోవలసిన అత్యవసర విషయమే ఈ ముల్లోకాల మర్మాలు. ఎందుకనగా భూమిమీద ప్రయాణించవలసిన మనిషి - ఎక్కడ నుండి ఎక్కడికి పోవలెనో అను విషయం తెలియనివాడు, వాని ప్రయాణానికి గమ్యం ఉండకపోగా, ఆందోళనతోను, అతి భయంకరముగాను అతని ముగింపు ఉండునని మనకు తెలుసు. అందుకే ప్రయాణించవలసిన వారు - ప్రయాణపు తేదీని, బండి రిజర్వేషన్‌ను, పరిస్థితులను చక్కబరచుకొని సుళువుగాను ముందుగాను అనుకున్న గమ్యాన్ని సురక్షితముగాను చేరుకొనగలరు. ఇది సాధారణముగా భూమిమీద మనుష్యులు తీసుకొనవలసిన జాగ్రత్తలు లేక భద్రతలు.

మనిషి బ్రతికినంతకాలం - తన ప్రయాణాల కొరకు ఇంత జాగ్రత్త తీసుకొనగా, అదే మనిషి - తన దేహాన్ని చాలించి, వెళ్ళవలసిన రోజున ఎక్కడకు వెళ్ళవలెనో, ఎలాగు వెళ్ళవలెనో, ముందుగా సిద్ధపరచుకొన్న (రిజర్వేషన్) ప్రకారంగా ఎందుకు వెళ్ళవలెనో అను విషయాల వివరణలు తెలియకపోతే, ఆ ప్రయాణం అగమ్యగోచరం అవుతుందని మా పాఠకులు తెలుసుకోవాలి. మూడున్నర సంవత్సరాలు తన ప్రభువుతో కలసి, పరలోకమందున్న తండ్రికి సేవలనందించిన ఇస్కరియోతు యూదా - తప్పిపోయి తన చోటికి పోయెను - **అపో.కా. 1:25** అని వ్రాయబడినదంటే - ఏది అతని చోటు? - నా తండ్రి యింట అనేక నివాసములు కలవు, లేని ఎడల మీతో చెప్పుదును; మీకు స్థలము సిద్ధపరచ వెళ్ళుచున్నాను. నేను వెళ్ళి మీకు స్థలము సిద్ధపరచిన యెడల నేనుండు స్థలములో మీరును ఉండులాగున మరలా వచ్చి నాయొద్ద వుండుటకు మిమ్మును తీసుకొని పోవుదును - **యోహాను 14:2,3**. అయితే ఇస్కరియోతు, తండ్రి చోటుకి పోకుండా తన చోటికి పోయెనని అర్థమగుచున్నది. మనిషి - భూమిమీద బ్రతికిన కాలములో ఏచోటుకి పోవలెనని శ్రమించి సిద్ధపడగలడో, ఆ చోటికే పోవును గనుక తన కొరకు ఆలోచించిన ఇస్కరియోతు యూదా తన చోటుకి పోవుటలో న్యాయముంది.

మూల పురుషుడు, విశ్వాసులకు తండ్రియైన అబ్రాహాముకు దేవుడు పాలస్తీనా దేశాన్నే ఇచ్చివేశాడు. ఒక దేశాన్ని ఆ దినాలలో కలిగి వున్నాడంటే చిన్న విషయం కాదని మీకు తెలుసు. వంద గజాలు స్థలాన్ని కలిగివున్న మనల్నే ఎవ్వరూ అదుపుచేయలేనపుడు, ఒక దేశాన్నే కలిగివుంటే క్రైస్తవుని గతే మారిపోతుంది. అట్టి పరిస్థితుల్లో అబ్రహాము, అతని వారసులు, కుమారులైన ఇస్సాకు, యాకోబుల పాలస్తీనా దేశములో - ఇతరుల దేశములో వున్నట్టు పరవాసులుగా ఉండిరి. ఎందుకనగా దేవుడు దేనికి శిల్పియు నిర్మాణకుడై ఉన్నాడో పునాదులు గల ఆచోటు అనగా పరలోక పట్టణము కొరకు అబ్రాహాము అప్పటికే మరణించి మరోచోటు (తనచోటు మాత్రం కాదు) నుండి ఎదురు చూచుచుండెనని హెబ్రీ పత్రిక వ్రాసిన గ్రంథకర్త చెప్పుచున్నాడు. గమనిక : ఈ పత్రిక వ్రాయబడినప్పటికి అబ్రహాము భూమి మీద దేహమును చాలించి వెళ్ళి పోయెనని గ్రహించాలి. పునాదులు కలిగి, దేవుడే శిల్పి నిర్మాణకుడైన చోటే పరలోకం అని తెలుసుకోవాలి. దీనిని బట్టి పరలోకం చేరక, భూమిమీద లేక మరోచోటునుండి అబ్రాహాము ఎదురు చూచుచుండెను. **హెబ్రీ 11:9, 10.** పై సందర్భాలన్నీ పరిశోధించి, పరిశీలిస్తుంటే మూడుచోట్లు లేక స్థలాలు మనకు కనిపిస్తున్నాయి. వీటిని తెలుసుకొని సాధించినవారే విశ్వాస వీరులు. అందువలన వారు - తమ బ్రతుకు దినాలలో భూమిమీద పరదేశులమును, యాత్రికులమునైయున్నామని చెప్పుకొని, విశ్వాసము గలవారై మృతి పొందిరి. ఈ మర్మాన్ని సాధించిన వీరు - తమ స్వదేశాన్ని (పరలోకం) వెదకుచున్నారని గ్రహించాలి. వీరు ఏ దేశమునుండి వచ్చిరో ఆ దేశమును జ్ఞాపకముంచుకొన్న యెడల మరలా వెళ్ళుటకు వారికి వీలు కలిగియుండును. - **హెబ్రీ 11:13-16.**

బ్రతుకు కాలములో అనగా ఈ జీవితకాలము మట్టుకే మనము క్రీస్తునందు నిరీక్షించిన వారమైన యెడల మనుష్యులందరికంటె దౌర్భాగ్యులమై యుందుము. **1కొరింథి 15:19.** వారు ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తు విషయమైన అనుభవజ్ఞానము చేత ఈ లోకమాలిన్యమును తప్పించుకొనిన తరువాత మరలా వాటిలో చిక్కుబడి, వాటిచేత జయింపబడిన యెడల వారికడవరి స్థితి మొదటి స్థితి కంటె మరి చెడ్డదగును. వారు నీతిమార్గమును అనుభవ పూర్వకముగా తెలుసుకొని

(ఇస్కరియోతువలె), తమకు అప్పగింపబడిన పరిశుద్ధమైన ఆజ్ఞనుండి తొలగిపోవుటకంటె, ఆ మార్గము అనుభవపూర్వకముగా తెలియక ఉండుటయే వారికి మేలు - **2 పేతురు 2:20,21**. ఎవనిచేత మనుష్య కుమారుడు అప్పగింపబడుచున్నాడో, ఆ మనుష్యుని (యూదా)కి శ్రమ! ఆ మనుష్యుడు పుట్టి యుండని యెడల అతనికి మేలు - **మార్కు 14:21**. దేవుని దివ్యవాక్యమును రాబోవు యుగసంబంధమైన శక్తుల ప్రభావమును అనుభవించిన తరువాత తప్పిపోయినవారు - తమ విషయములో దేవుని కుమారుని శిలువకు అప్పగించి, బాహాటముగా ఆయనను అవమానపరచుచున్నారు. గనుక తమ చోటికి పోవు వారిని మరలా నూతన పరచుట అసాధ్యం - **హెబ్రీ 6:5,6**. అందువలన నామమాత్రంగా ప్రభువును నమ్మి, వేషధారణతో బ్రతుకుచున్న కోట్లాది మంది క్రైస్తవులనబడిన వారిలో ఎంత మందికి తెలుసు ఈ మూడు లోకాల మర్మాలు. బైబిలు గూర్చిగాని ప్రభువుని గూర్చిగాని చదువుకొనుట, పరిశీలించుట, తెలుసుకొనుట అను పదాలకు అర్థం తెలియని వారుగా వున్నారంటే నమ్మగలరా? ఈ బ్రతుకు కాలంలో సుఖంగా శరీరాన్ని పెంచుటకు - ఎంత సంపాదించాం? ఏం సాధించాం? అనుకుంటూనే కాలాన్నంతా వ్యర్థపరచి, గమ్యం తెలుసుకొనక అర్థాంతరంగా ఆవిరైపోతున్నారు. ప్రార్థనలు చేయుట, గుడికి పోవుట, వాక్యం వినుట, పాటలు పాడుట, చందా యిచ్చుట అనే మూల పాఠాలకే అలవాటుపడుచున్నారు గాని పరమార్థాన్ని తెలుసుకొనక, తెలిసినా అంగీకరించని అజ్ఞానదశలో ఉన్నారు. పై కార్యాలన్నీ సంవత్సరాల తరబడి ఆచరిస్తూ, పరలోకానికి పోగలమను గ్రుడ్డి నమ్మకాలతో కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నారు. కాలమును బట్టి చూచితే వీరు బోధకులుగా ఉండవలసిన వారై యుండగా, దేవుని మాటలలో మొదటి మూల పాఠములను వీరికి మాటిమాటికి బోధింపవలసి వస్తుంది - **హెబ్రీ 5:12** నామకార్థ వేషధారణ క్రైస్తవ జనాంగమా, ఇకనైనా కళ్ళు తెరువు, గమ్యం చేరు.

చచ్చినంతవరకు స్వర్గానికే పోగలమను గ్రుడ్డి నమ్మకముతో బ్రతికే కొంతమంది భక్తుల గురించి మీకు తెలియకుండుట నాకిష్టము లేదు. మాకు కాకుండా ప్రభువు పరలోకాన్ని మరెవ్వరికి యివ్వగలడను ధీమాతో చచ్చి, అటు పరలోకానికి ఇటు భూలోకానికి చెడి నరకస్థులైరి. వారెవరనగా - ఆ దినమందు అనేకులు ప్రభువును చూచి - ప్రభువా, ప్రభువా, మేము నీ నామమున ప్రవచింపలేదా? (బాగా గుర్తుకి తెచ్చుకో ప్రభువా) నీ నామమున అనేకమైన అద్భుతములు చేయలేదా? (మరచిపోకుండా ఆలోచించు ప్రభువా) అని చెప్పుదురు. అప్పుడాయన ఏమంటున్నారో చదవండి. - నేను మీలాంటి వరాలున్న మహాభక్తులను ఎన్నడును ఎరుగను. పైగా అక్రమము చేయువారలారా, నా యొద్దనుండి పొండి (గెట్ అవుట్) అని వారితో చెప్పుదును - **మత్తయి 7:22, 23**. ఈ సంగతులను ఆలోచిస్తే పై క్వాలిఫికేషన్స్‌గల అభ్యర్థులంతా తమ చోటికి పోవువారేనని దేవుని వాక్యం ప్రభోదిస్తుంది. అందువలన ప్రియ చదువరీ, వందల సంవత్సరాలుగా సాతానుకు తొత్తులుగా మారి యేసును అవమానపరచిన ఈ కుళ్ళు క్రైస్తవ సమాజం నుండి బయటకురా, ప్రభువు నిన్ను తన వాక్యం ద్వారా పిలుస్తున్నాడు. వాయిదాలతో వంకరమార్గం గుండా యూదావలె తన చోటికి పోక నీ ప్రయాణంను ప్రతీ క్షణం జాగ్రత్తగా కొనసాగించు.

మొదటి మానవుడైన ఆదాము పుట్టుక - సృష్టి అంతటికీ విచిత్రమైనది. ఎందుకనగా వేదాన్ని బట్టి ఆలోచిస్తే ఇద్దరి పురుషుల సమ్మేళనమే మొదటి మానవుని నిర్మాణం. మా బాహ్యపురుషుడు కృశించుచున్నను, ఆంతర్య పురుషుడు (కనబడని ఆత్మ పురుషుడు) దినదినము నూతన పరచబడుచున్నాడు. - **2కొరింథీ 4:16**. ఈ మట్టి పురుషునిలో ఆత్మ పురుషుడు ఉన్నంతకాలం తండ్రియైన దేవునికి దూరంగా ఉన్నాడు. **2కొరింథీ 5:7** ఆంతర్య పురుషుడు లేక ఆత్మ పురుషుడు దేవుని వలన పుట్టినవాడే గాని, బాహ్యపురుషుడు లేదా మట్టిపురుషునివలె రక్తమువలనైనను, మనుష్యుల కోరికల వలనైనను పుట్టక, తండ్రి ఆత్మనుండి మాత్రమే పుట్టియున్నాడు - **యోహాను 1:13**. అందుకే ఆంతర్య పురుషుడే జీవింపజేయుచున్నాడు గాని శరీర పురుషుడు కేవలము (బొత్తిగా) నిష్ప్రయోజనమైనవాడే - **యోహాను 6:63**...నని తెలుసుకొనుచున్నాము.

నరుని పుట్టుకలోని అద్భుత రహస్యాన్ని ఛేదించకముందు మరో వాస్తవాన్ని పరిశీలిద్దాం. మహోన్నతుడగు దేవునికి నిరంతర యాజకుడైన మెల్కీసెదెకుకు అబ్రాహాము తన సంపాదనలో పదియవ వంతు ఇచ్చెను. సహజంగా

అబ్రాహాము సంతానములోని ఇశ్రాయేలీయులు తమ తమ పదియవవంతులను తమ సహోదరులైన లేవీ గోత్రము వారికిచ్చుట దేవుని ఏర్పాటు. ఎందుకనగా వారు యాజకధర్మము చేసేవారు. **అయితే మీరిక్కడ గమనించవలసిన అతి ప్రాముఖ్యమైన సంగతి లేక మర్మం ఏమనగా** - అబ్రాహాము మెల్కీసెదెకు అను యాజకునికి పదియవ వంతులను చెల్లించినపుడు, అతని సంతానము నుండి పుట్టబోవు లేవీయులు కూడా మెల్కీసెదెకుకు దశమ భాగములను చెల్లించియున్నారని గ్రంథకర్త చెప్పుచున్నాడు. ఇశ్రాయేలీయుల మిగిలిన గోత్రముల నుండి పదియవ వంతులను పుచ్చుకొను లేవియు అబ్రహాము ద్వారా పదియవ వంతు యిచ్చెను. ఎలాగనగా మెల్కీసెదెకుకు లేవి పితరుడైన అబ్రాహామును కలుసుకొనినప్పుడు లేవీ అబ్రాహాము గర్భంలో వుండెను గనుక లేవి కూడా కానుకలను చెల్లించెనని ఈ వేదం చాటుచున్నది. - **హెబ్రీ 7:4-10.**

పై యధార్థాన్ని మనసునందుంచుకొని ఈ క్రింది నగ్న సత్యాన్ని జాగ్రత్తగా చదువవలెను. దేవుడైన యెహోవా నేలమంటితో నరుని నిర్మించి (బాహ్యపురుషుని), వాని నాసికారంధ్రములలో జీవ వాయువును తన నుండి ఊదగా నరుడు జీవాత్మ (అంతరంగ పురుషుడు) ఆయెను. **ఆదికాండం 2:7,** దేవుడు తన స్వరూపమందు (అంతరంగ పురుషుడు లేక ఆత్మ) నరుని సృజించెను. దేవుని స్వరూపమందు వాని సృజించెను. ఆ కుమారుని (ఆదాము)ను విడదీసి, స్త్రీనిగాను, పురుషునిగాను వారిని సృజించెను - **ఆది.కా. 1:27,** ఆదాము దేవునికి కుమారుడు - **లూకా 3:38,** ఈ వాక్యాన్ని గమనిస్తే కేయినాను ఎనోషుకు, ఎనోషు షేతుకు, షేతు ఆదాముకు పుట్టి యుండగా ఆదాము మాత్రం దేవునికి పుట్టియున్నాడని వాక్యం చెబుతుంది.

సృష్టి ముందు కలిగిందా? ఆదాము ముందు పుట్టియున్నాడా? అని బైబిల్‌ని ప్రశ్నిస్తే - సృష్టి ముందుగా దేవుని మాట వలన మాత్రమే కలిగియున్నది. ఆదికాండం ప్రారంభ అధ్యాయాన్ని పరిశీలిస్తే కలుగుగాక అని దేవుడు పలికినపుడెల్లా సృష్టిలో ప్రతీది కలిగియున్నదని ముందుగా మీరు తెలుసుకోవాలి. ఆఖరిగా, కలుగజేయబడిన సృష్టిలోని నేలమట్టి నుండి నరుని శరీరాన్ని చేసి, ఆ మట్టి బొమ్మ లేక బాహ్య పురుషుని లోనికి తన జీవాన్ని లేక ఆత్మను ప్రవేశపెట్టి ఆదాముగా కనియున్నాడు. కొంతకాలానికి ఆదాము మరణిస్తే - అతని శరీరాన్ని ఆదాము శవం అంటామే గాని ఆదాముగా పిలువలేముగదా. ఎందుకనగా ఆదాము తనకున్న బాహ్యపురుషుని వదలి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయిన ఆత్మను ఆదాము అని అంటామే గాని విడిచి పెట్టిన మట్టి బొమ్మను మాత్రం శవంగా పిలుస్తాం. పై విధంగా దేవుని వలన, దేవునిలో నుండి సృష్టిలోనికి (మట్టిబొమ్మలోనికి) వచ్చిన ఆదాము, సృష్టి పుట్టకముందు ఎక్కడ వున్నట్లు? ఆలోచించగలరా? మెల్కీసెదెకు అను దేవుని యాజకునికి మన తండ్రి అబ్రాహాము దశమ భాగములను అర్పించినప్పుడు, నాల్గవతరము వాడైన లేవి తన ముత్తాతయ్య గర్భమందు లేడంటారా? ఏలాగనగా లేవి తన తండ్రియైన యాకోబులోను, యాకోబు ఇస్సాకులోను, ఇస్సాకు అబ్రహాములో వున్నట్లేగా, అదే నిజమైతే దేవుడు సృష్టిని పుట్టించక మునుపు కూడా ఆదాము తండ్రియైన దేవుని గర్భమందు వున్నట్లేగా. మీరు క్షయబీజమునుండి కాక, శాశ్వతమగు జీవముగల దేవుని వాక్యము మూలముగా అక్షయబీజము నుండి పుట్టినవారు - **1 పేతురు 1:22, 23,** దేవుడు కుమారులనుగా మిమ్మును చూచుచున్నాడు. అందువలన మీరు శిక్షణ పొందనియెడల దుర్భీజులే గాని కుమారులు కారు. అయితే **ఆత్మలకు తండ్రియైన దేవునికి** మరి యెక్కువగా లోబడి బ్రతుకవలెను గదా. నా కుమారుడా, ప్రభువుచేయు శిక్షణను తృణీకరింపకుము. అని కుమారులతో సంభాషించుచున్నాడు. - **హెబ్రీ 12:6-10.** అందరికి తండ్రియైన దేవుడు ఒక్కడే. ఆయన అందరికిపైగా ఉన్నవాడై ఆదామునుండి పుట్టిన వారందరిలోను వ్యాపించి అందరిలో వున్నాడు.....కాదనగలరా?

విషయాలన్నీ తీవ్రంగా పరిశీలిస్తే - ఆదాము తన శరీరంలోనికి రాకముందు దేవునిలో పరలోకమందున్నాడు. దేవుడు సృష్టిని కలుగజేస్తున్నపుడు దేవునిలో ఉన్నాడు. సృష్టి పుట్టిన పిమ్మట పరలోకాన్ని, దేవున్ని విడచి ఈ భూలోకానికి వచ్చాడు. భూలోకానికి వచ్చిన మొదటి మానవుని నుండి మాత్రమే స్త్రీనిగా తండ్రి తీయగలిగాడు - దేవుడైన యెహోవా ఆదాము నుండి తీసిన ప్రక్కటెముకను స్త్రీనిగా నిర్మించెను. నా ఎముకలో ఎముక నా మాంసములోని మాంసము నరుని

నుండి (దేవుని నుండి కాదు) తీయబడెను గనుక నారి అనబడును - **ఆది.కా. 2:22,23.** - పురుషుడైతే దేవుని పోలికయునైయున్నాడు. స్త్రీ (అవ్వ) పురుషుని నుండి కలిగెనే గాని, పురుషుడు (ఆదాము) స్త్రీ నుండి కలుగలేదు. - **1కొరింథీ 11:7,8.** పై వచనములను బట్టి ఆదాము నుండి అవ్వ కలుగగా వారిరువురి నుండి లోకములోని మనుష్యులంతా పుట్టుకు వచ్చు చున్నారు అలాగు పుట్టిన ప్రతీవారునూ సాక్షాత్తూ దేవుని పిల్లలును, ఆ దేవుని ఆత్మనే కలిగిన (పరిశుద్ధాత్మ కాదు) కుమారులుగా ఉన్నారు. - యావద్భూమి మీద కాపురముండుటకు ఆయన ఒకని నుండి ప్రతి జాతి మనుష్యులను సృష్టించెను - **అపో.కా. 17:26,27.** ముందు వ్రాసిన విధంగా లోకమందలి మనుష్యులందరిలో అదే తండ్రి ఆత్మ విభాగింపబడి, ఇంకనూ విభాగింపబడుచున్నదని గ్రహించుకొనవలెను.

**అందరికి తండ్రియైన దేవుడు ఒక్కడే. ఆయన అందరికి పైగా ఉన్నవాడు, అందరిలోనూ వ్యాపించి ఉన్నాడు. ఎఫెసి 4:6.**

**నా ఊపిరి యింకను నాలో పూర్ణముగా ఉండుటను బట్టియు, దేవుని ఆత్మ నా నాసికారంధ్రములలో ఉండుటను బట్టియు - యోబు 27:2.**

**దేవుని ఆత్మ నన్ను సృజించెను. సర్వశక్తుని యొక్క శ్వాసము నాకు జీవమిచ్చెను. యోబు 33:4.**

**దేవుడు - తన శ్వాస నిశ్వాసములను తన యొద్దకు తిరిగి తీసుకొనిన యెడల, శరీరులందరు ఏకముగా నశించుదురు. నరులు మరలా ధూళియై పోవుదురు. - యోబు 34:14,15.** మహర్షియగు యోబు పలికిన పలుకుల్లో ఎంత నిజముందో **గ్రహించారా?**

**యెహోవా నా స్వాస్థ్య భాగము, నీవే భూమి మీదగల నీ నుండి వచ్చిన నాభాగమును (ఆత్మను) కాపాడుచున్నావు - కీర్తనలు 16:5.**

**యెహోవా నీవే నా భాగము - కీర్తనలు 119:57.** రాజగు దావీదు పలికిన వేదాంత రహస్యాలు కాగా....

**యెహోవా నా భాగమని నేననుకొనుచున్నాను. ఆయనయందు నేను నమ్మిక ఉంచుకొని యున్నాను. - విలాప వాక్యములు 3:24.**ప్రవక్తయైన **యిర్మియాలోని ఆవేదనను ఆలోచించగలరా?**

ఈలాగు బైబిల్ అంతా పరిశీలిస్తే దివినుండి భువికి అరుదెంచిన నరులంతా దేవుని సర్వశక్తిగల ఆత్మను కలిగి దేవుని కుమారులుగా జీవించి, మరణం పిమ్మట ఏఏ లోకాలగుండా ప్రయాణించవలసిందో ముందుగానే ఎరిగి, భూమిమీద గల తమ ఆత్మలను రక్షించుకొనుటలో తమ శరీరాలను సయితం లెక్కచేయక ఈ నేలపై భౌతిక శరీరాలను విడిచిపెట్టి, విశ్వాస వీరుల జాబితాలో చేరిపోవాలి.

ఒకే ఒకసారి దేవుని ఆత్మనుండి ఆదాము ఆత్మ విడిపోయింది. అలాగు విడిపోయిన ఆదాము ఆత్మ నుండి కోటానుకోట్ల ఆత్మలు యిప్పటికిని, లేక లోకాంతము వరకు విడిపోవలసిందే. గడ్డిని విత్తనములిచ్చు చెట్లను, భూమి మీద తమతమ జాతి ప్రకారము తమలో విత్తనములుగల ఫలమిచ్చు వృక్షఫలములను భూమి మొలిపించునుగాక అని ఆజ్ఞ యియ్యగా ఆ ప్రకారమాయెను - **ఆది.కా. 1:11,12,** ముందు విత్తనం కలుగలేదుగాని దేవుని మాటవలన వృక్షము మాత్రమే మొదట కలిగింది. ఆ వృక్షమునుండి విత్తనములు, ఆ విత్తనముల నుండి వృక్షములు ఈ ప్రకృతిలో కలుగుచున్నవి. అదే విధంగా పరలోకపు తండ్రి ఒక్కసారే తన ఆత్మనుండి ఒక భాగాన్ని విడదీసి, దానికి ఆదాముగా పేరిడి, వానిద్వారా ఈ భూమిని నిండించినట్లు కోటానుకోట్ల ఆత్మలను చూడగలుగుచున్నాము. - దేవుడు ఆదాము, అవ్వలను ఆశీర్వదించిన విధమేదనగా - మీరిరువురు ఫలించి అభివృద్ధి పొంది విస్తరించి భూమిని నిండించుడి - **ఆది.కా. 1:27, 28.** మన అందరి యెడల జరిగిన క్రియను చూస్తుంటే - మనం మనతల్లిదండ్రులలోనికిని, వారు వారి తల్లిదండ్రులలోనికిని పోతున్నప్పుడు కడకు ఆది తల్లిదండ్రులైన ఆదాము హవ్వలే మిగిలినప్పుడు, హవ్వ ఆదాములోనికి, ఆదాము దేవునిలోనికి పోగా, ఆ తండ్రియైన దేవుడు సృష్టిని చేయక మునుపు పరలోకములో వున్నప్పుడు, మనమంతా మన తండ్రియైన

దేవునిలో పరలోకమందు లేమని చెప్పగలరా? అందువలన మనమంతా పరలోకమునుండి ఈ భూమిమీదకు వచ్చిన పరజనులమే గాని ఈ నేలకు సొంతమైన వారముకాము. ఈ సంగతులను ఎరిగిన దేవుడు - తన సేవకుడైన యోబుతో ఏమని పలుకుచున్నాడో ఇపుడు మీకు తెలియుట ఎంతైనా అవసరం "పౌరుషము తెచ్చుకొని నీ నడుము బిగించుకొనుము. నేను నీకు ప్రశ్న వేయుదును. నీవు దానిని నాకు తెలియజెప్పుము. నేను భూమికి పునాదులు వేసినపుడు నీవు ఎక్కడ వుంటివి? నీకు వివేకము కలిగియున్న యెడల చెప్పుము. ఉదయ నక్షత్రములు ఏకముగా కూడి పాడినప్పుడు దేవదూతలందరును ఆనందించి జయధ్వనులు చేసినప్పుడు దాని మూలరాతిని వేసిన వాడు ఎవడు?....ఇదంతయు నీకు తెలిసేయున్నది గదా, నీవు బహువృద్ధుడవు యోబువైన నీవు అప్పటికి పుట్టియుంటివి" - **యోబు 38:1-7, 21.**

సృష్టి కలుగక మునుపు మనమంతా (యోబుతో సహా) దేవునిలో వున్నాం. మనమంతా ఆయనలో నున్నపుడే సృష్టి కలిగించబడినప్పుడు మనకు తెలియని సంగతులు అంటూ ఉంటాయా? ఆత్మ మట్టిబొమ్మ లోనికి ప్రవేశించి అవిధేయతలో పడింది గనుక గత వైభవాన్ని మర్చిపోయి, మరొక విధంగా నష్టపోయామనే చెప్పాలి. ఆదాము పాపములో పడకముందు - దేవుడు ఆయనకు గాఢనిద్ర కలుగజేసి, ప్రక్కటెముకను తీసి, హవ్వగామలచి, అతని చెంతకు తెచ్చినపుడు, ఆదాము ఆమెను చూచి ఎక్కడి నుండి ఏ విధముగా వచ్చినదో తండ్రి చెప్పకపోయినా చెప్పగలిగాడు. అది ఒకనాటి మనకున్న కాలజ్ఞానం, దివ్యజ్ఞానం. దేవునికి అవిధేయులైన ఈ నరులు గతాన్ని, గమ్యాన్ని మరచి ఎక్కడనుండి ఎక్కడికి పోతున్నారోనను సంగతిని మరచిన అజ్ఞానులుగా భూమిమీద సాతాను ఇనుపసంకెళ్ళలో బంధింపబడి, దేవునికి దూరమై బానిసలుగా బ్రతుకుచున్నారు. తమ చోటికి పోవుటకే కడకు నిర్ణయించుకున్నారు. - యూదులు యేసుని కొట్టవలెనని మరలా రాళ్ళు చేతపట్టుకొనగా, యేసు - తండ్రి యొద్దనుండి అనేకమైన మంచి క్రియలను మీకు చూపితిని; వాటిలో ఏక్రియ నిమిత్తం నన్ను రాళ్ళతో కొట్టుదురని వారి నడిగెను. అందుకు యూదులు - నీవు మనుష్యుడవై యుండి దేవుడనని చెప్పుకొనుచున్నావు గనుక దేవదూషణ చేసినందుకే నిన్ను రాళ్ళతో కొట్టుదుము; గాని మంచి క్రియలు చేసినందుకు కాదు అని చెప్పిరి. అందుకు యేసు మీరు దైవములని నేనంటినని మీ ధర్మశాస్త్రములో వ్రాయబడి యుండలేదా? వాక్యము నిరర్థకము కానేరదుగదా దేవుని వాక్యము ఎరిగిన వారే దైవములని, నేను దేవుని కుమారుడనని చెప్పినందుకా నన్ను కొట్టుదురు - **యోహాను 10:32-35.** దైవముల మధ్య తీర్పు తీర్చుచున్నాడు. మీరు దైవములనియు, మీరంతా యెహోవా కుమారులని నేనే సెలవిచ్చియున్నాను. అయినను ఇతర మనుష్యులు చనిపోవునట్లు మీరును చనిపోవుదురు - **కీర్తనలు 82:1,6.** కాకిపిల్ల కాకి కాగలిగినప్పుడు, కుక్కపిల్ల కుక్క కాగా, దేవుని కుమారుడు దేవుడు కాలేడా? కాగలడు అని బైబిల్ చెబుతుంటే కాలేవని అపవాది నీతో చెప్పిస్తుంది. ఎందుకనగా - దేవుని స్వరూపియైయున్న క్రీస్తు మహిమను కనుపరచు సువార్త (వాక్యపు వెలుగు) ప్రకాశము వారికి ప్రకాశింపకుండు నిమిత్తము, ఈ యుగసంబంధమైన దేవత మనలను దాని చోటికి తీసుకొని పోవుటకు అవిశ్వాసులైనవారి మనోనేత్రములకు గ్రుడ్డితనము కలుగజేయుచున్నది. **2 కొరింథీ 4:4** అందువలన మనకుగల గత వైభవాన్ని తెలుపుటకు వచ్చిన యేసుని చూచి - నీవు సమరయుడవు, దయ్యము పట్టినవాడవు అన్నారు. **యోహాను 8:47, 48.** అపుడు యేసు వారిని చూచి - మీరేల నా మాటలు గ్రహింపకున్నారు. మీరు నా బోధ విననేర కుండుటవలననేగదా? అందుకే మీరు మీ తండ్రియగు అపవాది సంబంధులు మీరు యిప్పటికిని మీ తండ్రి దురాశలను నెరవేర్చగోరుచున్నారు. - **యోహాను 8:43,44.** దేవుని మాటలను నమ్మలేని, గ్రహించలేని వీరిని అనగా దయ్యాలను దేవుళ్ళు అంటే సహించగలవా? పరము నుండి భువికి వచ్చిన దేవుని పిల్లలంటే వీరికి తెలియకపోవచ్చుగాని, భువినుండి నరకానికి పోయే దయ్యాలంటే వీరు బాగుగా ఎరుగుదురు.

పరలోకం నుండి భూమి మీదకు రంగప్రవేశం చేసిన ఆదాము ద్వారా మనమంతా ఒకరి వెంబడి ఒకరము ఈ లోకంలోనికి రాగలుగుచున్నాం. అయితే ఇక్కడొక తిరకాసును మనం గమనించాలి. ఏమనగా - పర్వతములు పుట్టక మునుపు భూమిని లోకమును నీవు పుట్టింపక మునుపు యుగయుగములు నీవే దేవుడవు, తండ్రివి అయితే భూమి మీదకు వెళ్ళిన మమ్మును అక్కడనే ఉండనీయక ఏ మంటి నుండి తీసితివో, ఆ మంటికి మా శరీరాలను తిరిగి

మార్చుతూ తిరిగిరండని సెలవిచ్చుచున్నావు. ఎందుకనగా మాకు నివాస స్థలము నీవేగా - **కీర్తనలు 90:3.** నీ కుమారులమైన మమ్మును వీడలేక, నీకు దూరముగా ఎక్కువకాలం ఉంచలేక నీ దగ్గరకు పిలుచుచున్నావు సుమా. - మన్నయినది వెనుకటి వలెనే మరల భూమికి చేరును. ఆత్మ మాత్రం దాన్ని దయచేసిన తండ్రియైన దేవుని యొద్దకు మరలిపోవును. - ప్రసంగి 12:7. ఈ విధంగా మరలి పోవుట దేవుడున్న పరలోకానికా? లేక దానికి ముందు ఇంకే లోకానికైనా వెళ్ళవలసివుందా?

ఈ విషయంలో నేటి బైబిలు పండితుల మధ్య అనేక భిన్నాభిప్రాయములు గలవు. దానికి ఒకటే కారణం, బైబిలు మాకు బాగా తెలుసుననుకొని, దానిని జాగ్రత్తగా పరిశోధించక పోవడమే. ఆ దౌర్భాగ్యపు స్థితి మా ప్రియ పాఠకులకు ఉండకూడదనే ఈ ముల్లోకాల రహస్యాలను మీ ముందుంచుచున్నాను. ఇప్పటికే మీరు అనేకులైన తప్పుడు బోధకుల బోధనల వలనను, వారి సాహిత్యముల వలనను, బైబిలులోని తిన్నని మార్గాన్ని విడచి, వక్రంగా ప్రయాణించవచ్చు గనుక వ్రాయబడిన ప్రతి సంగతిని మరలా చదివి, గ్రహించుటకు శ్రమ పొందగలరు. - సత్య వాక్యమును సరిగా ఉపదేశించువానిగాను అంటే సరిగా విభజించువానిగా బోధకుడుండాలి గాని తెలియని సంగతులను సొంతజ్ఞానంతో బోధించి, అమాయకులను పాడుచేయుటకు కాదు. **2తిమోతి 2:15.** ఎందుకనగా గ్రుడ్డివాడు మరో గ్రుడ్డివానికి త్రోవజూపితే, ఇద్దరు కలసి గుంటలో పడుదురను యేసు మాటలను జ్ఞాపకం చేసుకోండి. ఈ సందర్భంలో నా చిన్ననాటి ఒక కథ గుర్తుకొస్తుంది. ఒక సంఘంలోని సభ్యుడు చనిపోయి తిన్నగా నరకానికి పోయాడట. అక్కడ తనకంటే ముందు చచ్చివచ్చిన పాస్టరు గారిని చూచి - అయ్యా, తమరు కూడా ఇక్కడున్నారేంటి అని ఆశ్చర్యపోతూ పెద్దగా అరిచాడట. అంతే ఆ పాస్టరుగారు మిక్కిలి కోపగించి, గట్టిగా అరవకు ప్రక్కన బిషప్‌గారున్నారని చెప్పాడట. సత్యవాక్యాన్ని ఆత్మయొక్క గమ్యం కొరకు గాక కేవలం లోకంలో బ్రతుకుతెరువు కొరకే ఉపయోగించు మోసగాండ్రయిన పనివారి బారినపడిన సంఘాలన్నీ అదే దుస్థితికి దిగజారిపోగలవని పాఠకులకు గుర్తు చేస్తున్నాను.

భూమి మీద మరణించిన నీతిమంతులంతా పరలోకానికి వెళ్ళిపోయారని అనేకుల నమ్మకం. కాని కేవలం బైబిలు ప్రకారంగా అది నిరాధారం. ఆదాము మొదలుకొని భూమి మీద చనిపోయిన నీతిమంతులెవ్వరైనా సరే పరలోకానికి వెళ్ళలేదని మొదట మీరు గ్రహించాలి. హనోకు దేవునితో నడిచెనని వ్రాయబడినదిగాని పరలోకానికి వెళ్ళెనని మాత్రం అక్కడ చెప్పలేదు. అలాగే ప్రవక్తయైన ఏలియా అగ్ని రథముల మీద ఆరోహణుడైనాడని వ్రాయబడినది గాని స్వర్గానికి వెళ్ళెనని మాత్రంలేదు. ఈ మాటలను, తెలియనివారు వక్రీకరించడం మామూలే. ఆ విధంగానే యేసుక్రీస్తు కూడా ఆరోహణమాయెననగా తండ్రి దగ్గరకు వెళ్ళిపోయాడని గ్రుడ్డిగా నమ్ముతున్నారే గాని ఆయన ప్రయాణపు వివరములను తెలుసుకొనలేకపోవుచున్నారు. - యేసు ఆరోహణమాయెననగా మొదట భూమి యొక్క క్రింది భాగములకు దిగెనని అర్థమిచ్చుచున్నది గదా అలాగు దిగిన తరువాత ఆకాశమండలములన్నిటి కంటె మరి పైకి ఆరోహణమైన వాడునైయున్నాడు - ఎఫెసీ 4:9,10. అనేకులు అపార్థం చేసుకొనునట్లు యేసు సిలువలో మరణించి, నా ఆత్మను తండ్రికి అప్పగించు కొనుచున్నానంటే పరలోకానికే పోయివుంటాడని తప్పుగా యోచిస్తున్నారు. ఒకవేళ అది నిజమైతే - సిలువలోని ఒక వైపునగల దొంగను చూచి, నేడు నీవు నాతో కూడా పరదైసులో వుందువని చెప్పినమాట అబద్ధమవుతుంది. ఇక్కడ మరో విషయాన్ని మీరు గమనించాలి. పరలోకం వేరు, పరదైసువేరు. ఇవి రెండు ఒక చోట మాత్రం లేవు.

ఇక అసలు విషయానికొద్దాం. పైన ఆకాశమందేకాని, క్రింద భూమియందేకాని, భూమి క్రింద నీళ్ళయందేగాని ఉండుదేని రూపమునైనను, విగ్రహమునైనను నీవు చేసికొనకూడదు. **నిర్గమ. కా. 20:4,** పై వచనములో నేటి అధునాతన శాస్త్ర ప్రపంచానికి తెలియని ఎన్నో రహస్యాలున్నవని తెలుసుకొనగలరు. నేడు మనం జీవిస్తున్నది సూర్య కుటుంబములోని మూడవ గ్రహమైన భూమి మీద మాత్రమే. ఈ విశ్వంలో సూర్యుడే ఒక నక్షత్రం కాగా, మనకంటికి, శాస్త్రానికి కనిపించని కోటానుకోట్ల నక్షత్రాలున్నవని ఒప్పుకొనక తప్పదు. ఈలాగు కనిపించిన, కనిపించని ఎన్నెన్నో వస్తువులు ఈ విశ్వంలో లేక వలయంలో దాగి ఉన్నవి. వీటి యొక్క సంపూర్ణ వివరములు నా తొలి మాస పత్రికలలో మీ కొరకు పొందుపరచాను. భూమి, సూర్య, చంద్ర, నక్షత్రాలు మున్నగు వాటినన్నింటిని చుట్టినదే వలయాకారంగా గల నీలి నీలి ఆకాశపుజలాలు. -

జలముల మధ్య ఒక విశాలముగలిగి ఆ జలములను ఈ జలములను వేరు పరచుగాకని ఆజ్ఞయిచ్చెను. దేవుడు ఆ విశాలము చేసి విశాలము క్రింది జలములను వేరుపరచగా ఆ ప్రకారమాయెను. దేవుడు వాటి మధ్యగల విశాలమునకు ఆకాశమని పేరుపెట్టెను. - **ఆది.కా. 1:6-8.** ఆ ఖాళీ స్థలములోనే పైన చెప్పినవన్నియు కలుగజేయబడియున్నవి. ప్రపంచ ప్రఖ్యాత ఖగోళ శాస్త్రవేత్తయైన గెలిలియో మాట్లాడుతూ - ఈ విశ్వమంతటికీ భూమి మాత్రమే సెంటర్ పాయింటని రుజువు చేశాడు.

ఇక దేవుడు మోషేద్వారా తన ప్రజలైన ఇశ్రాయేలీయులకు పది ఆజ్ఞలుగల ధర్మశాస్త్రాన్నిస్తూ - "పైన ఆకాశమందేగాని" అని వ్రాయబడిన విధంగా మనం చూస్తున్న ఈ ఆకాశం పైన అనగా మనం, మన భూమిగల వలయంపైన అని అర్థం. అనగా పైలోకం లేక పరలోకం అని సులువుగా చెప్పవచ్చును - స్తెఫెను పరిశుద్ధాత్మతో నిండుకొనినవాడై ఆకాశంవైపు చూచి, దేవుని మహిమను, యేసు తండ్రి కుడిపార్శ్వ మందు నిలచియుండుట చూచి - ఆకాశము తెరువబడుటయు, యేసు తండ్రి కుడిప్రక్క నిలిచియుండుటయు చూచెను. అనగా భూమిమీద నుండి పైకి చూడగలుగుచున్నాడని చెప్పవచ్చు. **అపొ.కా. 7:55,56.** - యేసు బాప్తీస్మం పొందినపుడు పైన నీలిగా మూసుకుపోయిన ఆకాశము తెరువబడి, దేవుని ఆత్మ పావురము వలెదిగగా, ఆ చీలిన ప్రాంతం నుండి పరలోకమందున్న తండ్రి ఇదిగో ఈయనే నా ప్రియకుమారుడు ఈయనయందు నేను ఆనందించుచున్నానని ఒక శబ్దము వచ్చెను. **మత్తయి - 3:16,17.** అలాగే యేసు ఈ మాటలు చెప్పి ఆకాశము వైపు కన్నులెత్తి తండ్రిని ప్రార్థించెను. - **యోహాను 17:1.** నేడు మనం నివసిస్తున్న ఈ భూగోళం అనునది - సూర్య, చంద్ర, నక్షత్రములు, గ్రహములున్న ఒక వలయంలో ఉన్నది. బైబిలును బట్టి ఆలోచిస్తే భూమిపైన, క్రింద జలములతో వలయంగా ఏర్పడిన దానిలో సూర్యకుటుంబపు మూడవ గ్రహముగా వున్నది. ఈ వలయం చుట్టూ గల జలములు తెరువబడకపోతే మరో లోకాన్ని చూడడం జరుగదు. నోవహు జలప్రళయకాలంలో భూమినంతటిని ముంచుటకు ఆకాశపు జలములను కొంత భూమి మీదకు రప్పించినట్లు చూడగలము. **ఆదికా. 7:11,** మనమున్న ఈ వలయం చుట్టూ నీలంగా కనబడునదే ఆకాశమనియు, జలములతో నిండిన వలయమనియు చెప్పవచ్చు. ఈ వలయాన్నే రెండవ ఆకాశమని గాని మధ్య ఆకాశమని గాని పిలువవచ్చును. ఈ వలయం నుండి పైకి కన్నులెత్తి చూస్తున్నదే పరలోకం లేక ఒకటవ ఆకాశం.

**- యేసు కన్నులు పైకెత్తి తండ్రీ అని ప్రార్థించుచున్నాడు. యోహాను 11:41,17:1**

**- ఆకాశమువైపు కన్నులెత్తి, ఆశీర్వదించి - మత్తయి 14:19**

పరలోకం లేక పైలోకం లేక ఒకటవ ఆకాశం అని పిలువబడుచున్నదే, ఆత్మలకు తండ్రి ఉన్న మహాలోకమని మీరు గుర్తించాలి. పైన ఆకాశమందే గాని అనునది పరలోకము లేక మొదటి ఆకాశమనియు, క్రింద భూమియందేగాని అనగా రెండవ ఆకాశము లేక మధ్యాకాశం లేక ఈ వలయంలోని భూమిమీద గాని అని గ్రహించాలి. పిమ్మట భూమి క్రింద నీళ్ళయందేగాని అని వ్రాయబడినది.

ఇక్కడ ఒక విచిత్రమైన మాట వ్రాయబడినది. ఏమనగా నీళ్ళు సముద్రాలుగా భూమిమీద ఉన్నవిగాని భూమిక్రింద లేవని ఆలోచించాలి. ఎందుకనగా మహాసముద్రాల లోతునకుపోతే, అక్కడ తగిలే అడుగు భాగం కూడా భూమే. అలాంటప్పుడు నిర్గమ 20:4లోని **"భూమిక్రింద నీళ్ళు"** అనగా సముద్రాలు మాత్రం కాదని తేలిపోయింది. అలాంటప్పుడు భూమిక్రింద నీళ్ళు అనగా ఏవి? **ఆదికాండం 1:6-8.** వరకు వ్రాయబడిన వాటిలో విశాలము క్రింద జలములు అని ప్రస్తావించబడినది. అనగా మధ్యాకాశపు లేక రెండవ ఆకాశవలయపు క్రింది జలములే భూమియొక్క క్రింది జలములు. మనమున్న ఈ భూమికి దిగువనున్న వలయపు అంచునగల జలములే భూమి క్రింది జలములు. ఉదాహరణకు : మనం ప్రతిదినం సూర్యుని చూచుచున్నాము, అయితే ఈ సూర్యునికి పైన ఆకాశవలయం వున్నది, యింకా ప్రక్కన కూడా అదే వలయం వుంది. అలాగే భూమికి కూడా పైన, క్రింద, చుట్టూ వలయమున్నది. ఇక్కడ మాత్రం భూమిక్రింది జలములు

లేక క్రింద వలయాన్ని తెరిస్తే కనిపించేదే మూడవ ఆకాశం లేక వలయం లేక పాతాళలోకం. పై జలాలను లేక ఆకాశాన్ని తెరిచినప్పుడు అది పరలోకంగా కనబడితే, దిగువ జలాలను లేక వలయపు ఆకాశాన్ని తెరిచినప్పుడు పాతాళలోకం లేక మూడవ ఆకాశాన్ని చూడగలం.

నేటి మానవ జ్ఞానం మనం చూస్తున్న విశ్వానికి లేక ఈ వలయానికే పరిమితమైంది కాని వలయం దాటలేదు. మరో విధంగా చెప్పాలి అంటే ఈ వలయం కొరకు కూడా ప్రస్తుతానికి సరియైన అవగాహన నేటి ఈ శాస్త్ర ప్రపంచానికి లేదు. నక్షత్రమండలాలను దాటని శాస్త్ర జ్ఞానం, వలయాన్ని దాటడం అసంభవమనే చెప్పవచ్చు. ఏది శాస్త్రానికందనిదో **దానిని మన తండ్రి మనకొరకు బైబిలు అనే వేదమందు భద్రపరచాడు.** నిజంగా మనం ఎంత అదృష్టవంతులమో అని మీరే ఆలోచించాలి. ఈ జ్ఞానం ఒక వ్యక్తికో, లేక ఏదో ఒక శక్తికో కాక, లోకమందలి తన కుమారులైన మన అందరికొరకు ఇంతకాలం దాచి, నేడు మనముందుకు తెచ్చాడు. - దేవుడు తన్ను ప్రేమించు వారి కొరకు ఏవి సిద్ధపరిచెనో అవి కంటికి కనపడలేదు, చెవికి వినపడలేదు. మనుష్య హృదయమునకు గోచరము కాలేదు అని వ్రాయబడియున్నది. మనకైతే దేవుడు వాటిని తన ఆత్మ వలన బయలుపరచి యున్నాడు. ఆ ఆత్మ అన్నిటిని దేవుని మర్మములను కూడా పరిశోధించుచున్నాడు. **1కొరింథి 2:9,10.**

నేలనుండి తీయబడిన నరుడు దేహములో వున్నంతకాలం ఈ భూమి మీద లేక ఈ వలయంలో ఉండి తీరాలి. సాక్షాత్తు దేవుని ప్రియ కుమారుడైన క్రీస్తు కూడా ఈ వలయంలోనికి శరీరధారియై వచ్చెను గనుక శరీరులైన వారంతా ఆయనను అంగీకరించవలసిందే - మరి ఎవనివలన రక్షణ కలుగదు, ఈ నామముననే మనము రక్షణ పొందవలెను గాని ఆకాశము క్రింద మనుష్యులలో ఇయ్యబడిన మరి ఏ నామమున రక్షణ పొందలేము - **అపో.కా. 4:12.** మనుష్యులు లేక నరజాతి ఈ వలయంలో మాత్రమే (మధ్యాకాశంలోనే) రక్షణ పొందాలి గాని, మరో లోకంలో మారడానికి అవకాశంలేదు. మరొకరి వలన కూడా ఈ భాగ్యాన్ని పొందలేము. మధ్యాకాశానికి (2.వ. ఆకాశం) పై నున్న లోకమే పరలోకం (1.వ ఆకాశం). ఈ మూడు లోకాలు వాటి యందున్న వారి గొప్పతనాలు చెపుతూ బైబిల్ ఏమంటున్నదంటే - **పరలోకమందున్న వారిలో గాని, భూమిమీద ఉన్న వారిలోగాని, భూమి క్రింద ఉన్నవారిలో గాని ప్రతీవాని మోకాలు యేసు నామమున మాత్రమే వంగి తీరాలి - ఫిలిప్పీ 2:9,10.** పై వచనములను బట్టి మూడు లోకములు ఉన్నవని ఖచ్చితంగా చెబుతూ, మూడు వలయాలను వరుసగా ప్రస్తావించడం జరిగింది.

ఈ మధ్యకాలంలో ఒక దారుణమైన అబద్ధాన్ని సంఘాలలో అనేకులైన అమాయక బోధకులు బోధించినట్టుగా విన్నాను. కొంతమందికి భూమిలో నుండి కొంతమంది కేకలు, ఆర్తనాదాలు వినబడ్డాయని, అవి భూమిలోపలి భాగంలోని నరకంలోని వారి ఏడుపులని చెప్పుకుంటున్నారు. ఈ విషయం సైన్సుకు తెలిస్తే నవ్విపోతుంది. ఎందుకనగా భూమిలో ఎక్కడ ఏమి దాగివుందో నేటి సైన్సుకు బాగా తెలుసు. అంతేకాదు భూమిని ఏ ప్రక్కనుండి త్రవ్వుకు పోయినా కడకు తిరిగి శూన్యంలోకి రాకతప్పదు. అలాంటప్పుడు భూమి పగిలి లోపలినుండి కేకలు వినబడుచున్నాయంటే నమ్మగలరా? ఇక పాతాళ లోకం ఎక్కడవుందో, దీనికిముందే తెలుసుకున్నారు. భూమిని విడిచి, మిగిలిన గ్రహాలను, నక్షత్రమండలాలను దాటి ఆకాశపు అంచుకు చేరి, దానిని తెరచుకొని, క్రిందకు దిగితేనే గాని మూడవ ఆకాశమైన పాతాళలోకానికి చేరలేము. కట్టుకథలతో దేవున్ని మనచుట్టూ ఉన్నవారికి చూపకూడదు. సైన్సుకు మించిన సాక్ష్యాలతో ఎదుటి మనుష్యులను ప్రభువు వైపునకు త్రిప్పాలిగాని కాకమ్మ కథలతో మాత్రం కాదు. మన వేదాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే - 2వ ఆకాశములోని భూమిమీదనుండి కొందరు 3వ ఆకాశానికి వెళ్ళినట్లును, అలాగే 3వ ఆకాశమైన పాతాళ లోకము నుండి కొందరు 2వ, ఆకాశములోని భూమి మీదకు వచ్చినట్లును ఆధారములున్నవి.... గమనించండి.

20వ, శతాబ్దంలోని బైబిల్ పండితులకు బైబిలుపై సరైన అవగాహన లేదనే చెప్పాలి. ఎందుకనగా భూమిమీద మరణించిన ప్రతీ ఒక్కరూ సరాసరి దేవుడున్న లోకమైన పరలోకానికే వెళ్ళిపోయారని తలస్తూ, బోధిస్తూ ఉన్నారుగాని కేవలం అది నిరాధారం. భూమి మీద మొదటి మానవుడైన ఆదాము మొదలుకొని నేటివరకు లేక ఈ యుగాంతం వరకు

యేసు క్రీస్తు తప్ప మరెవ్వరును పరలోకానికి వెళ్ళలేదు, వెళ్ళలేరు. ఈ విషయం నేడు ప్రపంచంలో ఎంతమంది బోధకులకు తెలుసు? ఆలోచించండి. ముందు వ్రాసిన విధంగా హనోకు దేవునితో నడిచెనని, ఏలియా అగ్ని రథాలపై ఎత్తబడగా పరలోకానికే పోయివుంటాడను గ్రుడ్డినమ్మకాలతో ఉన్నారేగాని ఎక్కడకు వెళ్ళారోనను విషయాన్ని వీరు చెప్పలేరు. మనకందరకు బాగా ఎరుకైన వారు రాజైన దావీదు, అతని గూర్చి దేవుడు సాక్ష్యం చెబుతూ - నేను యెష్షయి కుమారుడైన దావీదును కనుగొంటిని, అతడు నా యిష్టానుసారుడైన మనుష్యుడు అతడు నా ఉద్దేశ్యములన్నియు నెరవేర్చును - **అపొ.కా. 13:22,** అంతటి దావీదు మరణించిన తరువాత పరలోకమునకు వెళ్ళలేదని దేవుడు చెప్పుచున్నాడు - దావీదు పరలోకమునకు ఎక్కిపోలేదు - **అపో.కా. 2:34.** అప్పటికి సుమారు వెయ్యి సంవత్సరాల క్రితం మరణించి, భూమిని అనగా రెండవ ఆకాశాన్ని విడిచిన రాజైన దావీదు ఒకటవ ఆకాశమైన పరలోకానికి వెళ్లలేదంటే మరే లోకానికి వెళ్ళినట్లు? ముల్లోకాలలో రెండు లోకాలలో లేని దావీదు తప్పని సరిగా మూడవ ఆకాశమైన పాతాళలోకములో ఉన్నట్లే. అయితే ఇక్కడొక తిరకాసు వుంది. కేవలం పాపాత్ములు మాత్రమే పాతాళలోకానికి పోతారు; దేవదూతలు పాపం చేసినప్పుడును, ఒకదూత మొట్టమొదటి సారిగా దేవుని మీద తిరగబడినప్పుడును పాతాళలోకానికే కదా పడద్రోయబడియున్నాడు అనే అనుమానం మీకు రావచ్చు. అది అక్షరాలా నిజం.

అయితే పాఠకులు గమనించవలసిన ఒక అద్భుతమైన రహస్యం ఇక్కడ దాగివుంది. సృష్టికి ముందు దేవుని మీద మొదటిసారిగా తిరుగబడిన దూత - నీవు పాతాళ లోకంలోని నరకములో ఒక మూలకు త్రోయబడితివి. **యెషయా 14:15.** అలాగే దేవదూతలు పాపం చేసినప్పుడు దేవుడు వారిని విడిచిపెట్టక, పాతాళలోకమందలి కటిక చీకటి గల బిలములోనికి త్రోసెను. **2పేతురు 2:4** పై సంగతులను పరిశీలిస్తే పాతాళలోకం లేక అథోలోకం లేక మూడవ ఆకాశం అంతా కేవలం అపవిత్ర ఆత్మల కొరకేకాదు అని కనబడుచున్నది. ఎందుకనగా కొంత భాగాన్ని మాత్రమే వాటికి కేటాయించినట్లు కనబడుతుందంటే, మిగిలిన భాగాన్ని నీతిమంతుల ఆత్మలకేనని సులువుగా చెప్పగలం. విశ్వాసులకు తండ్రిగా, పరలోకపు తండ్రి పిలుపుకు లోబడిన ప్రియునిగా నిలచిన అబ్రాహాము, దావీదుకంటె ముందటి వాడని మనకు తెలుసు. ఆ అబ్రహాము కూడా పరలోకమునకు పోయిన దాఖలాలు లేవు. గాని పాతాళలోకమందలి ఒక చోటు అనగా నీతిమంతుల ఆత్మలయొద్దకు పోయెనని చూడగలం. భూమి మీద మరణించిన అబ్రాహాము - దేవుడు శిల్పి, నిర్మాణకుడునైన పునాదులుగల పరలోక పట్టణం కొరకు ఎదురుచూస్తుండెనని వ్రాయబడినది - **హెబ్రీ 11:10.** అయితే ఎక్కడనుండి ఎదురుచూస్తున్నట్లు? భూమి మీద నుండి మాత్రం కాదు, ఎందుకనగా హెబ్రీ పత్రిక వ్రాయబడినప్పటికే ఆయన చనిపోయెను గనుక పాతాళలోకమందలి "పరదైసు" అను నీతిమంతులు నెమ్మదిపొందు చోటు నుండి ఎదురు చూస్తుండెను.

ఆ దరిద్రుడు చనిపోయి దేవదూతలచేత అబ్రాహాము రొమ్మున ఆనుకొనుటకు కొనిపోబడెను. ధనవంతుడు కూడా చనిపోయి పాతిపెట్టబడెను. అప్పుడు ఆ ధనవంతుడు పాతాళములో అనీతిమంతులు గల వేదనకరమైన స్థలములో బాధపడుచు, కన్నులెత్తి దూరము నుండి అబ్రాహామును, అతని రొమ్మున ఆనుకొనియున్న లాజరును చూచి, దాహమునకు నీళ్ళడిగినప్పుడు అబ్రాహాము - నీవు నీ జీవితకాలమందు నీకిష్టమైనట్టు సుఖము అనుభవించితివి. అలాగుననే లాజరు కష్టము అనుభవించెను. ఇప్పుడైతే లాజరు ఇక్కడ (పాతాళలోకములోని పరదైసు) నెమ్మది పొందుచున్నాడు. నీవైతే ఇదేలోకంలో వేదన స్థలములో యాతనపడుచున్నాడు. అంతేకాక ఒకే లోకంలో ఉన్నమనం ఈ చోటునుండి ఆ చోటికి దాటి పోజాలకుండునట్లు మధ్య మహా అగాధముంచబడియున్నదని చెప్పెను. **లూకా 16:22-28.** పై సందర్భమును బట్టి నీతిమంతులు చనిపోయి పరలోకమునకు వెళ్ళక మూడవ ఆకాశమైన పాతాళలోకమందలి పరదైసు అను నీతిమంతులుండే చోటునుండి పరలోకం కొరకు ఎదురుచూస్తున్నట్టుగా కనబడుచున్నది. పౌలు భక్తుడు - క్రీస్తునందున్న ఒక మనుష్యుని నేను ఎరుగుదును. అతడు పదునాలుగు సంవత్సరముల క్రిందట మూడవ ఆకాశమునకు కొనిపోబడెను. అతడు ఆ మూడవ ఆకాశంలోని పరదైసు లోనికి కొనిపోబడెను. - **2కొరింథీ 12:2,3.** అని చెప్పుచున్నాడంటే పాతాళలోకమే మూడవ ఆకాశమనియు, అందే పరదైసు వున్నదనియు, మరణించిన వారంతా పాతాళలోకమందలి ఆ రెండు ప్రాంతాలలోని

ఏదోఒక చోటుకి పోవలసివుందని మన కళ్ళకు కట్టినట్లుగా కనిపించుచున్నది. ఇంకా మన వేదాన్ని పరిశోధిస్తే - యేసు, ఒక వైపునగల దొంగవానితో - నేడు నీవు నాతో కూడా పరదైసులో ఉందువన్నారే గాని పరలోకమని చెప్పలేదు! **లూకా 23:43.**

మనలో ఎక్కువమంది - యేసు శిలువలో మరణించగానే, నేరుగా పరలోకానికి వెళ్ళిపోయాడను కుంటున్నారు గాని అది నిజం కాదు. ఎందుకనగా ప్రభువు సిలువలో శరీరాన్ని విడిచిపెట్టి, దొంగవానిని తీసుకొని మూడవ ఆకాశములోని పరదైసుకు పోయి, మానవ కాలమాన ప్రకారం శుక్రవారం మధ్యాహ్నం నుండి ఆదివారం తెల్లవారు వరకు అక్కడి వారితోనే గడిపియున్నారు. - ఆరోహణమాయెననగా యేసు మొదట భూమి యొక్క క్రింది భాగములకు దిగెననియు పిమ్మట ఆకాశమండలాలు అనగా 3వ ఆకాశాన్ని, 2వ ఆకాశాన్ని దాటి మరి పైకి ఆరోహణమైన వాడుగా కనబడుచున్నాడు - **ఎఫెసీ 4:9,10.** అలాగు క్రిందికి దిగిన యేసు, దొంగవానిని పరదైసులోని వారి చెంతకు చేర్చి, పిమ్మట ఆదివారం వేకువనే తిరిగి రెండవ ఆకాశమైన ఈ వలయంలోని భూమిమీదకు వచ్చు సమయానికి మగ్దలేని మరియ మన ప్రభువుని సమాధిలో వెదకి కనబడనందున, అక్కడ నిలచి ఏడ్చుచుండగా, ప్రభువు-ఆమెను పిలువగా, ఆమె తొందరపడి యేసును ముట్టుకొనబోవుచుండగా - యేసు ఆమెతో నేను యింకను తండ్రి యొద్దకు అనగా ఒకటవ ఆకాశం అయిన పరలోకానికి ఎక్కిపోలేదు గనుక నన్ను ముట్టుకొనవద్దు. అయితే నా సహోదరుల యొద్దకు వెళ్ళి - నా తండ్రియు మీ తండ్రియు, నా దేవుడును మీ దేవుడునైన వానియొద్దకు ఎక్కిపోవుచున్నాను (పైకి మాత్రమే) అని వారితో చెప్పమనెను. - **యోహాను 20:11-17,** ఈలాగున ప్రభువు ఒక్కడే పరలోకానికి వెళ్ళియున్నారు. మిగిలిన వారంతా పాతాళలోకమందలి పరదైసు లోనికి చేరి పునాదులుగల ఆ మహాలోకమైన పరలోకం కొరకు వేల, వందల సంవత్సరాలుగా నిరీక్షణతో ఎదురుచూస్తున్నారు.

అలా నిరీక్షించిన వారిలో మోషే, ఏలియాలు - ప్రభువు భూమి మీద ఉన్నప్పుడు పరదైసు నుండి వచ్చి, ప్రభువుని కలసి మాట్లాడి వెళ్ళి యున్నారు - **మార్కు 9:4,** అదే విధంగా రెండవ ఆకాశము నుండి మూడవ ఆకాశమునకు పోయినవాని విషయంకూడా **2కొరింథీ 12:2,3** వచనాలలో చూచియున్నారు. గాని ఈ రెండు లోకాలనుండి పరలోకానికి పోయిన వారిలో మన యేసు ఒక్కరే ఉన్నారు. ఎందుకనగా ఆయన పాతాళలోకంలో వుంటే మనకు స్థలాలు ఎవరు సిద్ధపరచగలరు? పిమ్మట తండ్రి దగ్గరకు మనలను ఎవరు తీసుకొని పోగలరు? ప్రవక్తయైన దావీదు యేసుని గూర్చి ప్రవచిస్తూ తండ్రీ-యేసు ఆత్మను నీవు పాతాళములో విడిచిపెట్టవు. అందరి మనుష్యులవలె ప్రభువు శరీరంను మట్టిలో కుళ్ళు పట్టనియ్యక మృతులలో నుండి లేపి పరలోకానికి తెచ్చావు - **అపొ.కా. 2:27.** ఎందుకనగా నీ కుమారుడైన యేసు ఉండు స్థలములో మమ్మును ఉంచుటకును, అక్కడ మాకు స్థలములు సిద్ధపరచుటకును ఆయనను మాకంటె ముందుగా పరలోకానికి తీసుకొనిపోతివి - **యోహాను 14:2,3.**

ఈ మూడు లోకాలలోని అతి ప్రాముఖ్యమైన సంగతి ఏమనగా - పరలోకమందున్న తండ్రిలోని ఆదాము భూమి మీదకు వచ్చినపుడు, మనమంతా దివినుండి భువిపైకి వచ్చియున్నాము. అలాగు భూమి మీద జన్మించి, మన బ్రతుకును బట్టి అధోలోకానికి జారిపోయాము, మొదటి నుండి రెండవ దానికి, రెండవ దాని నుండి మూడవలోకానికి జారిన మనలను తిరిగి మొదటి లోకానికి చేర్చే నాథుడే మన క్రీస్తు ప్రభువు అందుకే క్రీస్తుని మొదటి ఆకాశమునుండి క్రిందికి తెచ్చుటకు ఎవడు పరలోకమునకు ఎక్కిపోవును? ఎవడు అగాథములోనికి దిగి పోవును? క్రీస్తుని మృతులలోనుండి తిరిగి పైకి తెచ్చుటకు? - **రోమా 10:7.** చదివి అర్థం చేసుకోగలుగుచున్నారా? **ఈ ముల్లోకపు మర్మాలు.** ప్రస్తుతం లోకమందు జన్మించిన వారంతా మరణించి పాతాళలోకములోని నరకం, పరదైసు ప్రాంతాలలో ఉండిపోయారు. అయితే పరదైసులో ఉన్నవారు మాత్రమే పరలోకానికి వెళ్ళే అర్హతను పొంది, ప్రభువు యొక్క రెండవ రాకడకొరకు కనిపెట్టుచున్నారు. అంతవరకు వారికిగాని, భూమి మీదగల నీతిమంతులకు గాని పరలోక ప్రాప్తి ఉండదు. ఇందులో ఎవ్వరూ ముందు వెనకాల పరలోకానికి వెళ్ళకూడదు. - వీరందరూ ఆ వాగ్దానముల ఫలము అనుభవింపక పోయినను, దూరమునుండి చూచి, వందనము చేసి, తాము భూమి మీద ఉన్నపుడు కూడా, పరదేశులమును, యాత్రికులమై ఉన్నామని ఒప్పుకొని

విశ్వాసముగలవారై మృతి పొందిరి. ఈలాగు పరలోకాన్ని వెదకుచూ మరణించారు సుమా. అట్టివారి కొరకు దేవుడు ఒక పట్టణము సిద్ధపరచియున్నాడు - **హెబ్రీ 11:13-16.** దేవుని లెక్క పూర్తి యగునంతవరకు నీతిమంతులంతా పరదైసులోనికి చేరవలసిందే - దేవుని వాక్యము నిమిత్తమును, తాము యిచ్చిన సాక్ష్యము నిమిత్తమును వధింపబడినవారి ఆత్మలను బలిపీఠము క్రింద చూచితిని. ఆ ఆత్మలు ప్రభువుతో - నాథా, సత్యస్వరూపీ, పరిశుద్ధుడా - ఎంతకాలం ఈ లోకానికి తీర్పు, ప్రతి దండన చేయక వుందువని పలికినపుడు ఆయన - సహదాసులయొక్కయు, సహోదరుల యొక్కయు లెక్క పూర్తియగువరకు ఇంక కొంచెం కాలము ఆ లోకంలో మీరు విశ్రమింపవలెను-**ప్రకటన 6:9-11.**

ప్రయాణం చేయవలసిన టిక్కెట్టు కొనుక్కొని, రైలు రాకపోతే ఏవిధంగా వెయిటింగ్ రూంలో కనిపెడతామో, అదే విధంగా తమ విశ్వాసమువలన సాక్ష్యం పొందినవారైయుండి కూడా, లోకంలోని నీతిమంతులందరి కొరకు ప్రస్తుతం పరదైసులో కనిపెట్టుచున్నారు గనుక మనం వెళ్ళకుండా వారు పరలోకానికి పోలేరు. విశ్వాసమును బట్టి రాహాబను వేశ్య వేగుల వారిని సమాధానముగా చేర్చుకొని నందున అవిధేయులతో పాటు నశింపకపోయెను. ఇకను ఏమి చెప్పుదును? గిద్యోను, బారాకు, సమ్సోను, యెఫ్తా, దావీదు, సమూయేలు.... వీరందరు తమ విశ్వాసము ద్వారా సాక్ష్యము పొందిన వారైనను, మనము లేకుండా సంపూర్ణులు కాకుండు నిమిత్తము, దేవుడు మన కొరకు మరి శ్రేష్ఠమైన దానిని ముందుగా సిద్ధపరచెను గనుక మనకంటే ముందటి వారైన వీరంతా యింకను పరలోకమును, వాగ్దాన ఫలమును అనుభవింపలేదు - **హెబ్రీ 11:31-40.** మన తండ్రికి పక్షపాతము లేదు గనుక మనలందరినీ ఒకేసారి తన యొద్దకు తన కుమారుని ద్వారా రప్పించుకొనును. అందుకే పౌలు వ్రాస్తూ - సహోదరులారా, నిరీక్షణలేని యితరులవలె మీరు దుఃఖపడకుండు నిమిత్తం మరణించిన వారిని గూర్చి మీకు తెలియకుండుట మాకిష్టం లేదు. యేసు మృతి పొంది తిరిగి లేచెనని మనము నమ్మినయెడల, అదే ప్రకారము మనకంటె ముందు దేవునిలో మరణించినవారిని, మూడవ ఆకాశంలోని పరదైసు వాసుల్ని ముందుగా తెచ్చిన పిమ్మటనే, జీవించు మనమంతా మార్పుపొంది, మంద ఒక్కటిగా మారి యేసుతో కూడా మొదటి ఆకాశం అనగా పరలోకానికి ఎగసిపోగలం - **1థెస్స 4:13-18, 1కొరింథీ 15:20, 50-57.**

ప్రియ సోదర సోదరీ!

దేవుని పిల్లలమైన మనమంతా పరలోకం నుండి భూలోకానికి, భూలోకం నుండి పాతాళ లోకంనకు, ఆ పిమ్మట తిరిగి భూలోకానికి (ఎత్తబడుటకు), ఇక్కడనుండి మన ప్రభువైన యేసుతో కూడా చివరిసారిగా తండ్రిలోకం, మనలోకమైన పరలోకానికి చేరిపోతాము. ఈ సమయంలో మీరు ఒక్కసారి యేసుని జ్ఞాపకం చేసుకోండి. తండ్రిని పరలోకాన్ని విడిచి మనకోసం రెండవ ఆకాశంలో ప్రవేశించి, మనలను తిరిగి బ్రతికించుటకు ఈ లోకంనుండి పాతాళలోకానికి, ఆ పిమ్మట మృత్యుంజయుడై స్వర్గలోకానికి చేరుకున్నాడు. మనం కూడా ఆయన బాటలో నడువవలసినవారమై ప్రస్తుతం మధ్యాకాశములోని భూమి మీద బ్రతుకుచున్నాం. నామట్టుకైతే బ్రతుకుట క్రీస్తే, చావైతే లాభమని ప్రభువు కొరకు బ్రతికితే, మరణించి, పరదైసుని చేరుకొంటావు. జయించువానిని దేవుడు పరదైసులోని జీవవృక్షఫలములను భుజింపనిత్తును - **ప్రకటన 2:7** అక్కడనుండి ప్రభువైన యేసూ త్వరగా రమ్ము అని పిలుస్తావు - **ప్రకటన 22:20.** అందరితో కలసి ఆయనవలె తండ్రి దగ్గరకు ఎక్కిపోతావు. ఈ ప్రయాణంలో ప్రస్తుతం నీవు ఎక్కడవున్నావు? గమ్యం చేరాలని ఆశతో ఆయన కొరకు బ్రతుకుచున్నావా? అయితే నీవు తప్పనిసరిగా పరదైసుకి చేరి ప్రభువు వచ్చినపుడు మాతో కూడా పరలోకానికి చేరిపోతావు!

"దేవుని ప్రేమించువారికి, అనగా ఆయన సంకల్పము చొప్పున పిలువ బడినవారికి, మేలు కలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవి. దేవుడు ఎవరిని ముందుగా ఎరిగెనో, వారు తన కుమారునితో సారూప్యము గలవారగుటకు వారిని ముందుగా నిర్ణయించెను, ఎవరిని ముందుగా నిర్ణయించెనో వారిని పిలిచెను. ఎవరిని పిలిచెనో వారిని నీతిమంతులుగా తీర్చెను. ఎవరిని నీతిమంతులుగా తీర్చెనో వారిని మహిమపరచెను - **రోమా 8:29, 30.** అనగా పరలోకమునుండి

పరలోకమునకు లేదా మహిమ నుండి మహిమకు పోదుమని మరవొద్దు. యేసు - చేయుటకు నీవు నాకిచ్చిన పనిని నేను సంపూర్ణముగా నెరవేర్చి భూమి మీద నిన్ను మహిమపరచితిని. తండ్రీ, లోకము పుట్టక మునుపు నీయొద్దనాకు ఏ మహిమ పరలోకమందుండెనో ఆ మహిమతో నన్ను ఇప్పుడు నీ యొద్ద మహిమపరచుము. - **యోహాను 17:4,5.**

పరలోకమునుండి భూమికి వచ్చి, ఇక్కడ నుండి నీ క్రియలను బట్టి పరదైసుకు చేరుకుంటే ఆదామునందు అందరూ ఏలాగు మృతి పొందుచున్నారో, ఆలాగుననే క్రీస్తునందు అందరూ బ్రతికింపబడుదురు. ప్రతివాడును తన తన వరుసలోనే బ్రతకింపబడును. ప్రథమ ఫలము క్రీస్తు, తరువాత క్రీస్తు వచ్చినపుడు ఆయన వారు మాత్రమే బ్రతికింపబడి తండ్రి యొద్దకు ఎత్తబడుదురు - 1కొరింథీ 15:20-24. పిమ్మట లోకము నాశనమగును.

ముల్లోకపు మర్మాలు ఎరిగినవారలారా, మీరు స్థిరమైనదాని కొరకు వేగిరపడండి, గమ్యాన్ని చేరండి. ఎందుకనగా - మన పౌరస్థితి పరలోకమందున్నది; అక్కడనుండి ప్రభువైన యేసుక్రీస్తు అను రక్షకుని నిమిత్తం కనిపెట్టుకొనియున్నాము - ఫిలిప్పీ 3:20, భూమి మీద మన గుడారమైన ఈ నివాసము శిథిలమైపోయినను, చేతి పనికాక దేవుని చేత కట్టబడినదియు, నిత్యమునైన నివాసము పరలోకమందు మనకున్నదని ఎరుగుదుము - 2కొరింథీ 5:1.

